
శ్రీరస్తు.


శ్రీలక్ష్మీనృసింహాయనమః




# నృసింహశతకము.



శేషప్పకవి

ప్రణీతము.

ఇది

పండితులచే బరిశోధింపబడి

రాజమండ్రి వాస్తవ్యులగు

కర్రి అచ్చయ్యగారిచే

బ్రకటింపబడినది.





కాకినాడ:

స్కేప్ అండు కంపెనీ ముద్రితము.

1913. వెల 0-2-0



శ్రీ ర స్తు.

శ్రీలక్ష్మీనృసింహాయనమః

శేషప్ప కవి చే

రచింపఁబడిన

# నృసింహశతకము.

పండితులచేఁ బరిశోధింపఁబడి రాజమండ్రి వాస్తవ్యులగు

కర్రా అచ్చయ్యగారిచేఁ

ప్రకటింపఁబడినది.



కాకినాడ:

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలను ముద్రితము.

1913.

# పీఠిక.

ఈశతకాంత్యపద్యమున 'శేషప్ప యనుకవి చెప్పినపద్యముల్' అని యుండుటంజేసి యియ్యది శేషప్పప్రణీతమని తెలియుచున్నది. మఱియు నిది

'భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహా దురితదూర'

అనుటంబట్టి శ్రీధర్మపురమందున్న నరసింహస్వామికి అంకితమైనది. ఇంతేకాని దీనికవినిగురించిన దేశము కాలము మొదలగునవి తెలియకున్నవి. ఇయ్యది అంతగసలక్షణమైనది కాకపోయినను కవి భక్త్యతిశయముచేత నిందచ్చటచ్చట నరసింహస్వామినిగూర్చి చేయు స్తుతులును, దూషణములును, బేల బెదరింపులును, దీనప్రార్థనములును, ఇంపుగాను భక్తిరసజనకముగాను నుండును. కావున ఇది బహుజనులకు పఠనీయముగానున్నది. ఈకారణమును బట్టి దీనిని కొంతవఱకు పండితులచే సవరింపించి మాపినిన పాఠాంతరముల నాయా పుటలక్రింద నిమిడించి మంచికాగితములందు ముద్రింపించి ప్రకటించితిమి.

కరాణి అచ్యయ్య.

నీకటాక్షంబున ♦ నేరచించెదఁ గాని
ప్రజ్ఞ నాయది కాదు ♦ ప్రస్తుతింపఁ
తే. దప్పుపడ నేమి సద్భక్తి ♦ తప్పు వౌనె
చెఱకునకు వంకపోనేమి ♦ చెడునె తీపి
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహా ♦ దురితదూర. 2

సీ. నరసింహా నీదివ్య♦నామమంత్రముచేత
దురితజాలము లన్నిఁ ♦ దోలవచ్చు
నరసింహా నీదివ్య♦నామమంత్రముచేత
బలువైన రోగముల్ ♦ వాపవచ్చు
నరసింహా నీదివ్య ♦ నామమంత్రముచేత
రిపుసంఘముల సంహ♦రింపవచ్చు
నరసింహా నీదివ్య♦నామమంత్రముచేత
దండహస్తునిబంట్లఁ ♦ దరుమవచ్చు
తే. భళిర నే నీమహామంత్ర♦బలముచేత
దివ్యవైకుంఠపదవి సా♦ధింపవచ్చు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహా ♦ దురితదూర. 3

సీ. ఆదినారాయణా ♦ యనుచు నాలుకతోడఁ
బలుక నేర్చినవారి♦పాదములకు
సాష్టాంగ మగునమ♦స్కార మర్పణఁ జేసి
ప్రస్తుతించెద నయ్య ♦ బహువిధముల
ధరణిలో నరు లెంత♦దండివారైనను
నిన్నుఁ గాననివారి ♦ నేస్మరింప

నేను శ్రేష్ఠులమంచు ♦ నిక్కుచుండెడివారి
చెంతఁ జేరఁగఁబోను ♦ శేషశయన
తే. పరమసాత్త్వికులైన నీ♦భక్తవరుల
దాసులకు దాసుఁడను జుమ్మి ♦ ధాత్రిలోన
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 4

సీ. ఐశ్వర్యములకు ని ♦ న్ననుసరింపఁగ లేదు
ద్రవ్య మిమ్మని వెంటఁ ♦ దగుల లేదు
కనక మిమ్మని చాలఁ ♦ గష్టపెట్టఁగ లేదు
పల్లకిమ్మని నోటఁ ♦ బలుక లేదు
సొమ్ము లిమ్మని నిన్ను ♦ నమ్మికొల్వఁగ లేదు
భూము లిమ్మని పేరు ♦ పొగడ లేదు
బలము లిమ్మని నిన్ను ♦ బ్రతిమాలఁగా లేదు
పసుల నిమ్మని పట్టు ♦ బట్ట లేదు
తే. నేను గోరిన దొక్కటే ♦ నీలవర్ణ
చయ్యనను మోక్ష మిచ్చినఁ ♦ జాలు నాకు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 5

సీ. మందుఁడ నని నన్ను ♦ నిందఁ జేసిన నేమి
నాదీనతను జూచి ♦ నవ్వ నేమి
దూరభావము లేక ♦ తూలనాడిన నేమి
ప్రీతిసేయక వంకఁ ♦ బెట్ట నేమి
కక్కసంబులు పల్కి ♦ వెక్కిరించిన నేమి
తీవ్రకోపముచేతఁ ♦ దిట్ట నేమి

మెచ్చుమాటలచేత నమ్మోలాడిన నేమి
చేరి దాపట గేలి సేయ నేమి
తే. కల్పవృక్షమువలె నీవు గల్గ నింకఁ
బ్రజల లక్ష్యంబు నాకేల పద్మనాభ
భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 6

సీ. చిత్తశుద్ధిగ నీకు సేవ జేసెదఁ గాని
పుడమిలో జనుల మెప్పులకుఁ గాదు
జన్మపావనతకై స్మరణ జేసెదఁ గాని
సరివారిలోఁ బ్రతిష్ఠలకుఁ గాదు
ముక్తికోసరము నే మ్రొక్కి వేఁడెదఁ గాని
దండిభాగ్యము నిమిత్తంబు గాదు
నిన్నుఁ బొగడను విద్య నేర్చితి నే కాని
కుక్షి నిండెడు కూటి కొఱకుఁ గాదు
తే. పారమార్థికమునకు నేఁ బాటుపడితిఁ
గీర్తికి నపేక్షపడలేదు కృష్ణవర్ణ
భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 7

సీ. శ్రవణరంధ్రముల నీ సత్కథల్ పొగడంగ
లేశమానందంబు లేనివాఁడు
పుణ్యవంతులు నిన్నుఁ బూజసేయఁగఁ జూచి
భావమం దుత్సాహపడనివాఁడు
భక్తవర్యులు నీపై భావముల్ పొగడంగఁ
దత్పరత్వము లేక తలఁగువాఁడు

తనచిత్తమందు నీ ♦ ధ్యాన మెన్నఁడు లేక
కాలమంతయు వృథా ♦ గడపువాఁడు
తే. వసుధలో నెల్ల వ్యర్థుండు ♦ వాఁడె యగును
మఱియుఁ జెడుఁగాక యెప్పుడు ♦ మమత నొంది
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 8

సీ. గౌతమీస్నానానఁ ♦ గడతేరుదామంటె
మొనసి చన్నీళ్లలో ♦ మునుఁగలేను
తీర్థయాత్రలచేఁ గృ ♦ తార్థుఁ డౌదామంటె
బడలి నేమంబుతో ♦ నడువలేను
దానధర్మముల స ♦ ద్గతిని జెందుదమంటె
ఘనముగా నావద్ద ♦ ధనము లేదు
తప మాచరించి సా ♦ ర్థకము నొందుద మంటె
నిమిషమైన మనస్సు ♦ నిలుపలేను
తే. కష్టముల కోర్వ నాచేతఁ ♦ గాదు నిన్ను
స్మరణజేసెద నాయథా ♦ శక్తి కొలఁది
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 9

సీ. అర్థివాండ్రకు నీక ♦ హానిఁ జేయుటకంటెఁ
దెంపుతో వసనాభి ♦ దినుట మేలు
ఆఁడుబిడ్డలసొమ్ము ♦ లపహరించుటకంటె
బండఁగట్టుక నూతఁ ♦ బడుట మేలు
పరులకాంతలఁ బట్టి ♦ బల్మిఁ గూడుటకంటె
బడబాగ్నికీలలఁ ♦ బడుట మేలు

బ్రిదుకఁజాలక దొంగ♦పనులు సేయుటకంటెఁ
గొంగుళో *ముష్టెత్తు♦కొనుట మేలు
తే. జలజదళనేత్ర నీభక్త♦జనులతోడి
జగడ మాడెడుపనికంటెఁ ♦ జావు మేలు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 10
సీ. గార్దభంబున కేల ♦ కస్తూరితిలకంబు
మర్కటంబున కేల ♦ మలయజంబు
శార్దూలమున కేల ♦ శర్కరాపూపంబు
సూకరంబున కేల ♦ చూతఫలము
మార్జాలమున కేల ♦ మల్లెపువ్వులబంతి
గుడ్లగూబల కేల ♦ కుండలములు
మహిషంబునకును ని♦ర్మలవస్త్ర మదియేల
బకసంతతికి నేల ♦ పంజరంబు
తే. ద్రోహచింతన జేసెడి♦దుర్జనులకు
మధురమైనట్టి నీనామ♦మంత్ర మేల
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 11
సీ. పసరంబు పంజైనఁ ♦ బసులకాపరి తప్పు
ప్రజలు దుర్జనులైనఁ ♦ బ్రభుని తప్పు
భార్య గయ్యాళైనఁ ♦ బ్రాణనాథుని తప్పు
తనయుఁడు దుష్టైనఁ ♦ దండ్రి తప్పు
సైన్యంబు చెదరిన ♦ సైన్యనాథుని తప్పు

* యాచించి

కూఁతురు చెడుగైన ♦ మాతతప్పు
అశ్వంబు చెడుగైన ♦ నారోహకుని తప్పు
దంతి దుష్టయైన ♦ మావంతు తప్పు
తే. ఇట్టి తప్పు లెఱుంగక ♦ యిచ్చవచ్చి
నట్లు మెలఁగుదు రిప్పు డీ ♦ యవనిజనులు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర.
సీ. కోఁతికి జలతారు♦కుళ్లాయి యేటికి
విరిజాజిపూదండ ♦ విధవ కేల
ముక్కిడితొత్తుకు ♦ ముత్యంపు నత్తేల
నద్ద మేమిటికి జా♦త్యంధునకును
మాచకమ్మకు నేల ♦ మౌక్తికహారముల్
క్రూరచిత్తునికి స♦ద్గోష్ఠు లేల
లంజాబోతుకు నేల ♦ బింకంపునిష్ఠలు
వావి యేటికి దుష్ట♦వర్తనునకు
తే. మాటనిలుకడ సుంకరి♦మోటు కేల
చెవిటివానికి సత్కథా♦శ్రవణ మేల
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర.
సీ. మాన్యంబు లీయ స♦మర్థుఁ డొకఁడు లేఁడు
మాన్యముల్ చెఱుప స♦మర్థులంత
యెండినయూళ్ల గో♦డెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
బండినయూళ్లకుఁ ♦ బ్రభువులంత
యితఁడు పేద యటంచు ♦ నెఱిఁగింపఁ డెవ్వఁడు

కలవానిసిగ్గు లెన్నఁ ♦ గలరు చాలఁ
దనయాలిచేష్టల ♦ నెప్పుఁడెవ్వఁడుఁ
బెలికాంతలం గెన్నఁ ♦ బెద్దలంత
తే. గుట్టిదోషుల కధికార ♦ మిచ్చినట్టి
ప్రభులతప్పులటంచును ♦ బలుకవలెను
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 14

సీ. తల్లిగర్భమునుండి ♦ ధనము తేఁ డెవ్వఁడు
వెళ్లిపోయెడినాఁడు ♦ వెంటరాదు
*లక్షాధికారైన ♦ లవణ మన్నమె కాని
మెఱుఁగుబంగారంబు ♦ మ్రింగఁబోఁడు
విత్త మార్జనజేసి ♦ విఱ్ఱవీఁగుటె కాని
కూడఁబెట్టినసొమ్ము ♦ తోడరాదు
పొందుగా మఱుఁగైన ♦ భూమిలోపలఁ బెట్టి
దానధర్మములేక ♦ దాఁచి దాఁచి
తే. తుదకు దొంగల కిత్తురో ♦ దొరల కవునో
తేనె జుంటీఁగ లియ్యవా ♦ తెరువరులకు
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 15

సీ. లోకమం దెవఁడైన ♦ లోభిమానవుఁడున్న
భిక్షమర్థికిఁ జేతఁ ♦ బెట్టలేఁడు
తానుబెట్టకయున్నఁ ♦ దగవు పుట్టదుగాని
యొరులు పెట్టఁగఁజూచి ♦ యోర్వలేఁడు

* లక్షాధికుండైన

దాతదగ్గఱఁ జేరి ♦ తనముల్లె చెడినట్లు
జిహ్వతో చాడీలు ♦ చెప్పుచుండు
ఫలము విఘ్నంబైన ♦ బలుసంతసము నందు
మేలుగల్గిన చాల ♦ మిణుకుచుండు
తే. శ్రీరమానాథ యిటువంటి ♦ క్రూరగుణుఁడు
భిక్షుకులశత్రువని పేరు ♦ పెట్టవచ్చు
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 16

సీ. తనువులోఁ బ్రాణముల్ ♦ తర్లిపోయెడివేళ
నీస్వరూపమును ధ్యా ♦ నించునతఁడు
నిమిషమాత్రములోన ♦ నిన్నుఁ జేరును గాని
యమునిచేతికిఁ జిక్కి ♦ శ్రమలబడఁడు
పరమసంతోషాన ♦ భజన జేసెడివారి
పుణ్య మే మనవచ్చు ♦ భోగిశయన
మోక్షము నీదాస ♦ ముఖ్యుల కగుఁగాని
నరక మెక్కడి దయ్య ♦ నళిననేత్ర
తే. కమలనాభునిమహిమలు ♦ గానలేని
తుచ్ఛులకు ముక్తి దొరకుట ♦ దుర్లభంబు
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 17

సీ. నీలమేఘశ్యామ ♦ నీవె తండ్రివి మాకుఁ
గమలవాసిని మమ్ముఁ ♦ గన్నతల్లి
నీభక్తవరు లంత ♦ నిజమైన బాంధవుల్
నీకటాక్షము మాక ♦ నేకధనము

నీకీర్తనలు మాకు ♦ లోకప్రపంచంబు
నీసహాయము మాకు ♦ నిత్యసుఖము
నీమంత్రమే మాకు ♦ నిష్కళంకపువిద్య
నీపదధ్యానంబు ♦ నిత్యజపము
తే. తోయజాతాక్ష నీపాద ♦ తులసిదళము
రోగముల కౌషధము బ్రహ్మ ♦ రుద్రవినుత
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 18
సీ. బ్రతికినన్నాళ్లు నీ ♦ భజన తప్పనుగాని
మరణకాలమునందు ♦ మఱతు నేమొ
నా వేళ యమదూత ♦ లాగ్రహంబున వచ్చి
ప్రాణముల్ పెకలించి ♦ పట్టునపుడు
కఫవాతపైత్యముల్ ♦ గప్ప గాబరచేతఁ
గంప ముద్భవమంది ♦ కష్టపడుచు
నాజిహ్వతో నిన్ను ♦ నారాయణా యంచుఁ
బిలుతునో శ్రమచేతఁ ♦ బిలువలేనొ
తే. నాఁటి కిప్పుడె భక్తి నీ ♦ నామ మిదిగొ
తలఁచెదను జెవి నిడుమయ్య ♦ ధైర్యముగను
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 19
సీ. పాంచభౌతికము దు ♦ ర్బల మైన కాయం బి
దెప్పుడో విడుచుట ♦ యెఱుక లేదు
శతవర్షములదాఁక ♦ మితము సెప్పిరిగాని
నమ్మరా దామాట ♦ నెమ్మనమున

బాల్యమందో మంచి ♦ ప్రాయమందో లేక
ముదిమియందో లేక ♦ ముసలియందొ
యూరనో యడవినో ♦ యుదక మధ్యముననో
యెప్పుడో విడుచుట ♦ యేక్షణంబొ
తే. మరణమే నిశ్చయము బుద్ధి♦మంతుఁడైన
దేహ మున్నంతలో మిమ్ముఁ ♦ దెలియవలయు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహారనరసింహ ♦ దురితదూర. 20
సీ. తల్లిదండ్రులు భార్య ♦ తనయు లాప్తులు బావ
మఱఁదు లన్నలు మేన♦మామగారు
ఘనముగా బంధువుల్ ♦ గల్గినప్పటికైనఁ
దాను దర్లగ వెంటఁ♦దగిలిరారు
యమునిదూతలు ప్రాణ ♦ మపహరించుక పోఁగ
మమతతోఁ బోరాడి ♦ మాన్పలేరు
బలగమంతయు దుఃఖ♦పడుట మాత్రమె కాని
యించుక యాయుష్య ♦ మియ్యలేరు
తే. చుట్టములమీఁది భ్రమదీసి ♦ చూరఁజెక్కి
సంతతము మిమ్ము నమ్ముట ♦ సార్థకంబు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 21
సీ. ఇభరాజవరద ని ♦ న్నెంతఁ బిల్చినఁగాని
మాఱుపల్కవదేమి ♦ మౌనితనము
మునిజనార్చిత నిన్ను ♦ మ్రొక్కి వేఁడినఁగాని
కనులఁ బడవదేమి ♦ గడుసుఁదనము

చాల దైన్యము నొంది ♦ చాటుజొచ్చినఁ గాని
భాగ్య మియ్యనదేమి ♦ ప్రౌఢితనము
స్థిరముగా నీపాద♦సేవఁ జేసెడు నన్ను
బ్రోవఁ జాలవదేమి ♦ ధూర్తతనము
తే. మోక్షదాయక యిటువంటి ♦ మూర్ఖజనుని
కష్టపెట్టిన నీకేమి ♦ కడుపునిండు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 22
సీ. నీమీఁదికీర్తనల్ ♦ నిత్యగానము సేసి
రమ్య మొందింప నా♦రదుఁడఁ గాను
సావధానముగ నీ♦చరణపంకజసేవ
సలిపి మెప్పింపంగ ♦ శబరిఁ గాను
బాల్యమప్పటినుండి ♦ భక్తి నీయందునఁ
గలుగను బ్రహ్లాద♦ఘనుఁడఁ గాను
ఘనముగా నీమీఁద ♦ గ్రంథముల్ గల్పించి
వినుతి సేయను వ్యాస♦మునిని గాను
తే. సాధుఁడను మూర్ఖమతి మను♦ష్యాధముఁడను
హీనుఁడను జుమ్మి నీవు న ♦ న్నేలుకొనుము
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 23
సీ. అతిశయంబుగఁ గల్ల ♦ లాడ నేర్చితిఁ గాని
పాటిగా సత్యముల్ ♦ పలుక నేర
సత్కార్యవిఘ్నముల్ ♦ సలుప నేర్చితిఁ గాని
యిష్టమొందఁగ నిర్వ♦హింప నేర

నొకరిసొమ్ముకు దోసి ♦ లొగ్గ నేర్చితిఁ గాని
చెలువుగా ధర్మంబు ♦ సేయనేర
ధనము లియ్యంగ వ♦ద్దనఁగ నేర్చితిఁ గాని
శీఘ్రమిచ్చెడునట్లు ♦ చెప్పనేర
తే. పంకజాతాక్ష నేనంత ♦ పాతకుఁడను
దప్పులన్నియు క్షమియింపు ♦ తండ్రి నీవె
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 24

సీ. ఉర్విలో నాయుష్య ♦ మున్నపర్యంతంబు
మాయసంసారంబు ♦ మఱిగి నరుఁడు
సకలపాపములైన ♦ సంగ్రహించును గాని
నిన్నుఁ జేరెడియుక్తి ♦ నేర్వలేఁడు
తుదను గాలునివద్ది♦దూత లిద్దఱువచ్చి
గుంజుక చని వారు ♦ కొట్టుచుండ
హింస కోర్వఁగ లేక ♦ యేడ్చి గంతులువేసి
దిక్కు లేదని నాల్గు♦దిశలుఁ జూడఁ
తే. దన్ను విడిపింపవచ్చెడి ♦ ధన్యుఁ డేడి
ముందె నీదాసుఁడయ్యున్న ♦ ముక్తి గలుగు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 25

సీ. అధికవిద్యావంతు ♦ లప్రయోజకులైరి
పూర్ణశుంఠలు సభా♦పూజ్యులైరి
సత్యవంతులమాట ♦ జనవిరోధం బాయె
వదరుబోతులమాట ♦ వాసికెక్కె

ధర్మవాసనపరుల్ దారిద్ర్య మొందిరి
పరమలోభులు ధనప్రాప్తులైరి
పుణ్యవంతులు రోగభూతపీడితులైరి
దుష్టమానవులు వర్ధిష్ణులైరి
తే. పక్షివాహన మావంటి భిక్షుకులకు
శక్తి లేదాయె నిఁక నీవె చాటుమాకు
భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 26

సీ. భుజబలంబునఁ బెద్దపులులఁ జంపఁగవచ్చుఁ
బాముకంఠముఁ జంకఁ బట్టవచ్చు
బ్రహ్మరాక్షసకోట్లఁ బాఱఁ దోలఁగ వచ్చు
మనుజులరోగముల్ మాన్పవచ్చు
జిహ్వ కిష్టముగాని చేదు మ్రింగఁగ వచ్చుఁ
బదనుఖడ్గము చేతఁ బదుమవచ్చుఁ
గష్ట మొందుచు ముండ్లకంపలోఁ జొరవచ్చుఁ
దిట్టుపోతులనోళ్లు కట్టవచ్చుఁ
తే. బుడమిలో దుష్టులకు జ్ఞానబోధ తెలిపి
సజ్జనులఁ జేయలేఁ డెంత చతురుఁడైన
భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 27

సీ. అవనిలోఁ గలయాత్ర లన్నిఁ జేయఁగవచ్చుఁ
ముఖ్యుఁడై నదులందు మునుఁగవచ్చు
ముక్కుపట్టుక సంధ్య మొనసి వార్వఁగ వచ్చుఁ
దిన్నగా జపమాలఁ ద్రిప్పవచ్చు

వేదాల కర్థంబు ♦ విఱిచి చెప్పఁగవచ్చు
శ్రేష్ఠకర్తువులెల్లఁ ♦ జేయవచ్చు
ధనము లక్షలుకోట్లు ♦ దాన మియ్యఁగ వచ్చు
నైష్ఠికాచారముల్ ♦ నడుపవచ్చుఁ
తే. జిత్తమన్యస్థలంబునఁ ♦ జేరకుండ
నీపదాంభోజములయందు ♦ నిలుపరాదు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 28

సీ. కర్ణయుగ్మమున నీ♦కథలు సోఁకినఁ జాలు
పెద్దపోఁగులజోళ్లు ♦ పెట్టినట్లు
చేతు లెత్తుచుఁ బూజ ♦ సేయఁగల్గినఁ జాలు
దొరయఁగా గడియాలు ♦ దొడిగినట్లు
మొనసి మస్తకమింతో ♦ మ్రొక్కఁగల్గినఁ జాలుఁ
జెలువమైనతురాయి ♦ చెక్కినట్లు
*గళము నొవ్వఁగ నామ♦స్మరణ గల్గినఁజాలు
వింతగాఁ గంఠికల్ ♦ వేసినట్లు
తే. పూని నినుఁ గొల్చుటే సర్వ♦భూషణంబు
లితరభూషణముల నిచ్చ♦గింపనేల
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 29

సీ. భువనరక్షక నిన్నుఁ ♦ బొగడ నేరనివాని
పజకు గోచరమైన ♦ పాడుబొంద
సురవరార్చిత నిన్నుఁ ♦ జూడఁగోరనికనుల్

---

* గళము నొవ్వంగని ♦ తలఁపు

జలములోపల నెల్లి ♦ సరవుగుండ్లు
శ్రీరమాధిప నీకు ♦ సేవఁ జేయుని మేను
కూలి కమ్మగుమానె ♦ కొలిమితిత్తి
వేడ్కతో నీకథల్ ♦ విననికర్ణములైనఁ
కఠినశిలాదులఁ ♦ గలుగుతొలలు
తే. పద్మలోచన నీమీఁద ♦ భక్తి లేని
మానవుఁడు రెండుపాదాల ♦ మహిషమయ్య
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 30
సీ. అతివిద్య నేర్చుట ♦ యన్నవస్త్రములకే
పశుల నార్జించుట ♦ పాలకొఱకె
సతిని బెండ్లాడుట ♦ సంసారసుఖముకే
సుతులఁ బోషించుట ♦ గతులకొఱకె
సైన్యముల్ గూర్చుట ♦ శత్రుభయమునకే
సాములు నేర్చుట ♦ చావుకొఱకె
దానమిచ్చుటయు ముం♦దటిసంచితమునకే
ఘనముగాఁ జదువుట ♦ కడుపుకొఱకె
తే. యితరకామంబు గోరక ♦ సలలితముగను
భక్తినీయందు నిలుపుట ♦ ముక్తికొఱకె
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 31
సీ. ధరణిలో వెయ్యేండ్లు ♦ తనువు నిల్వఁగఁబోదు
ధన మెప్పటికి శాశ్వ♦తంబుగాదు
దారసుతాదులు ♦ తనవెంట రాలేరు

భృత్యులు మృతిని దప్పింపలేరు
బంధుజాలము నిన్ను బ్రతికించుకోలేదు
బలపరాక్రమము మేమి పనికిరాదు
ఘనమైన సకలభాగ్యం బెంత గల్గియు
గోచిమాత్రంబైన గొనుచుబోదు
తే. వేసికిముక్త లభ్రము లప్ప విడిచి నిన్ను
భజన జేసెడివారికిఁ బరమసుఖము
భూషణవికాస శ్రీధర్మ పురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 32
సీ. నరసింహ నాకు దుర్గుణము లే మెండాయె
సుగుణ మొక్కటిలేదు చూడఁజనిన
యన్యకాంతలమీఁద నాశ మానఁగలే
నొరులసొమ్ముల చూచి యోర్వలేను
ఇటువంటిదుర్బుద్ధు లెన్ని నాకున్నవి
నేను జేసెడివన్ని నీచకృతులు
నావంటిపాపిష్ఠు నరుని భూలోకానఁ
బుట్టఁజేసితి వేల భోగిశయన
తే. అబ్జదళనేత్ర నాతండ్రి వైనఫలము
నేరములుగాచి రక్షింపు నీవెదిక్కు
భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 33
సీ. ధీరతఁ బరుల్ నిందించు నేర్చితిఁగాని
తిన్నగా నిన్నుఁ బ్రస్తుతింప నైతిఁ
బొరుగుకామినులందు బుద్ధి నిల్పితిఁగాని

నిన్ను సంతతము ధ్యా♦నింపనైతిఁ
బెరికిమచ్చటలైన ♦ మురిసి వింటినిగాని
మంచి నీకథ లాల♦కించనైతి
గౌతుకంబునఁ బాత♦కము గడించితిఁగాని
హెచ్చుపుణ్యము సంగ్ర♦హింపనైతి
తే. నవనిలో నేను జన్మించి♦నందు కేమి
సార్థకము గానరాదాయె ♦ స్వల్పమైన
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 34
సీ. అంత్యకాలమునందు ♦ నాయాసమున నిన్నుఁ
దలఁతునో తలఁపనో ♦ తలఁతు నిపుడె
నరసింహ నరసింహ ♦ నరసింహ లక్ష్మీశ
దానవాంతక కోటి♦భాను తేజ
గోవింద గోవింద ♦ గోవింద సర్వేశ
పన్నగాధిపశాయి ♦ పద్మనాభ
మధువైరి మధువైరి ♦ మధువైరి లోకేశ
నీలమేఘశరీర ♦ నిగమవినుత
తే. ఈవిధంబున నీనామ ♦ మిష్టముగను
భజన సేయుచునుందు నా ♦ భావమందు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 35
సీ. ఆయురారోగ్యపు♦త్రార్థసంపదలన్ని
గలుగఁజేసెడిభార♦కర్త వీవె
చదువు లెస్సగనేర్పి ♦ సభలో గరిష్ఠాధి

కార మొందించెడి ♦ ఘనుఁడవీవె
నడకమంచిదిపెట్టి ♦ నగలు మెచ్చునట్టి
పేరు గప్పించెడి♦పెద్దవీవె
* బలువైనవైరాగ్య♦భక్తిజ్ఞానము లిచ్చి
ముక్తిఁ బొందించెదు♦మూర్తి వీవె
తే. అవనిలో మానవుల కన్ని♦యాపదలిచ్చి
వ్యర్థులనుజేసి తెలిపెడి♦వాఁడ వీవె
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 36
సీ. కాయ మెంతభయానఁ ♦ గాపాడినంగాని
ధాత్రిలో నది నాడఁ ♦ దక్కఁబోదు
ఏవేళ నేరోగ ♦ మేమరించును సత్వ
మొందఁగఁజేయు నే♦చందమునను
ఔషధంబులు మంచి ♦ వనుభవించినఁగాని
కర్మ క్షీణంబైనఁ♦గాని విడదు
కోటివైద్యులు గుంపు♦గూడివచ్చినఁగాని
మరణ మయ్యెడివ్యాధి ♦ మాన్పలేరు
తే. జీవునికిఁ బ్రయాణకాలంబు ♦ సిద్ధమైన
నిలుచునా దేహ మిం దొక్క♦నిమిషమైన
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 37
సీ. జందె మింపుగ వేసి ♦ సంధ్యవార్చిన నేమి
బ్రహ్మమందక కాఁడు ♦ బ్రాహ్మణుండు

* పరమభక్తిజ్ఞాన ♦ వైరాగ్యములొసంగి

తిరుమణిశ్రీచూర్ణ • గుఱుతు రేఖలిడినను
విష్ణు నొందఁగ రాఁడు • వైష్ణవుండు
బూదిని నుదుటను • బూసికొనిననేమి
శంభు నొందఁగ రాఁడు • శైవజనుఁడు
కాషాయవస్త్రాలు • కట్టి కప్పిన నేమి
యోగి పోలఁగ రాఁడు • యతివరుండు
తే. ఇట్టిలౌకిక వేషాలు • కట్టికొనిన
గురునిఁ జెందక సన్ముక్తి • దొరకఁబోదు
భూషణవికాస శ్రీధర్మ • పురనివాస
దుష్టసంహార నరసింహ • దురితదూర. 38

సీ. నరసింహ నే నిన్ను • నమ్మినందుకుఁ జాల
నెనరు నాయం దుంచు • నెమ్మనమున
నన్ని వస్తువులు ని • న్నడిగి వేసటపుట్టె
నింకనైనఁ గటాక్ష • మియ్యవయ్య
సంతసంబున నన్ను • స్వర్గమందే యుంచు
భూమియందే యుంచు • భోగిశయన
నయముగా వైకుంఠ • నగరమందే యుంచు
నరకమందే యుంచు • నళిననాభ
తే. ఎచట నన్నుంచినంగాని • యెపుడు నిన్ను
మఱచి పోకుండ * నీనామ • స్మరణ నొసఁగు
భూషణవికాస శ్రీధర్మ • పురనివాస
దుష్టసంహార నరసింహ • దురితదూర. 39

సీ. దేహమున్నవఱకు • మోహసాగరమందు

* నిగుణ

మునుఁగుచుందురు శుద్ధ◆మూర్ఖజనులు
సలలితైశ్వర్యముల్ ◆ శాశ్వతం బనుకొని
మత్తేభములను మూఁక◆జాల రెవరు
సర్వకాలము మాయ◆సంసారబద్ధులై
గురునికారుణ్యంబు ◆ గోరికొనరు
జ్ఞానభక్తివిరక్తు◆లైన పెద్దలఁ జూచి
నిందసేయక తాము ◆ నిలువలేరు
తే. మత్తులైనట్టిదుర్జాతి◆మనుజులెల్ల
నిన్నుఁ గనలేరు మొదటికే ◆ నీరజాక్ష
భూషణవికాస శ్రీధర్మ◆పురనివాస
దుష్టసంహార నరసింహ◆దురితదూర. 40
సీ. ఇలలోన నేజన్మ◆మెత్తినప్పటినుండి
బలు గడించితినయ్య ◆ పాతకములు
తెలిసి చేసితిఁ గొన్ని ◆ దెలియఁజాలక చేసి
బాధనొందితి నయ్య ◆ పద్మనాభ
అనుభవించెడునప్పు ◆ డతిప్రయాసం బంచుఁ
బ్రజలు చెప్పఁగఁ జాల ◆ భయముగలిగె
నరకపోవుటకునై ◆ యేయుపాయంబైనఁ
జేసి మాతమలన్నఁ ◆ జేతకాదు
తే. సూర్యశశినేత్ర నీచాటుఁ ◆ జొచ్చితిపుడు
కలుషములు దృంచి నన్నేలు ◆ కష్టమనక
భూషణవికాస శ్రీధర్మ◆పురనివాస
దుష్టసంహార నరసింహ◆దురితదూర. 41
సీ. తాపసార్చిత నేను ◆ బాపకర్ముఁడటంచు

నాకు వంకలఁ బెట్టఁ ♦ బోకు జిహ్మ
నాఁటికి శిక్షలు ♦ నాకుఁ జేయుటకంటె
వేఁడుసేయుదు నీవు ♦ నేస్త మనక
లోభ మొంకరు లైన ♦ యమదూతలకు నన్ను
నొప్పగింపకు మయ్య ♦ యురగశయన
నీ దాసులను బట్టి ♦ నీవు దండింపంగ
వద్దు వద్దన రెంత ♦ పెద్దలైనఁ
తే. దండ్రివై నీవు పరవీక్ష ♦ నగులఁ జేయ
వాసి గలపేరు కపకీర్తి ♦ వచ్చునయ్య
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 42

సీ. ధరణిలోపల నేను ♦ దల్లిగర్భమునందుఁ
బుట్టినప్పటినుండి ♦ పుణ్యమెఱుఁగ
నేకాదశీవ్రతం ♦ బెన్నఁడుండఁగ లేదు
తీర్థయాత్రలకైనఁ ♦ దిరుగ లేదు
పారమార్థికమైన ♦ పనులు సేయఁగ లేదు
భిక్ష మొక్కనికైనఁ ♦ బెట్టలేదు
జ్ఞానవంతులకైనఁ ♦ బూని మ్రొక్కఁగ లేదు
ఇతరదానములైన ♦ నియ్య లేదు
తే. నళినదళనేత్ర నిన్ను నే ♦ నమ్మినాను
జేరి రక్షింపవే నన్ను ♦ శీఘ్రముగను
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 43

సీ. అడవిపక్షుల కెవ్వఁ ♦ డాహార మిచ్చెను

మృగజాతి కెవ్వఁడు ♦ మేఁతఁ బెట్టె
వనచరాదులకు భో♦జన మెవ్వఁ డిప్పించెఁ
జెట్ల కెవ్వఁడు నీళ్లు ♦ చేఁది పోసె
స్త్రీలగర్భంబున ♦ శిశువు నెవ్వఁడు పెంచె
ఫణుల కెవ్వఁడు పోసెఁ ♦ బరఁగఁ బాలు
మధుపాళి కెవ్వఁడు ♦ మకరంద మొసఁగెఁ
బసుల కెవ్వఁ డొసంగెఁ ♦ బచ్చిపూరి
తే. జీవకోట్లను బోషింప ♦ నీవెకాని
వేఱె యొకదాత లేఁడయ్య ♦ వెదకిచూడ
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 44



సీ. దనుజారి నావంటి ♦ దాసజాలము నీకు
కోటిసంఖ్య గలదు ♦ కొదువ లేదు
బంట్లసందడివల్ల ♦ బహుపరాకై నన్ను
మఱచిపోకుము భాగ్య♦మహిమ చేత
దండిగా భృత్యులు ♦ దగిలి నీకుండంగ
బక్కబంటు పాటి♦పనికి నగును
నీవు మెచ్చెడిపనుల్ ♦ నేను జేయఁగలేక
యింతవృధాజన్మ ♦ మెత్తినాను
తే. భూజనులలోన నే నప్ర♦యోజకుఁడను
గనుక నీసత్కటాక్షంబు ♦ గలుగఁ జేయు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 45

సీ. కమలలోచన నన్నుఁ ♦ గన్నతండ్రివిగాన

నిన్ను నేమరకుంటి ♦ నేనువిడక
యుదరపోషణకునై ♦ యొకరి నే నాశింప
నేర నాకన్నంబు ♦ నీవు నడపు
పెట్టలేనంటివా ♦ పిన్నపెద్దలలోనఁ
దగవు కిప్పుడు దీయఁ ♦ దలఁచినాను
ధనము భారంబైన ♦ దలకిరీటము లమ్ము
కుండలంబులు పైఁడి♦గొలుసు లమ్ము
తే. కొనకు నీశంఖచక్రముల్ ♦ కుదువఁబెట్టి
గ్రాసము నొసంగి పోషించు ♦ కపట ముడిగి
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 46
సీ. కువలయశ్యామ నీ♦కొలువుచేసిన నాకు
జీతమెందుకు ముట్టఁ ♦ జెప్పవైతి
మంచిమాటలచేతఁ ♦ గొంచె మియ్యఁగ లేవు
కలహమైన నిఁకఁ జుమ్మి ♦ ఖండితముగ
నీవు సాధువు గాన ♦ నింతపర్యంతంబు
చనువుచే నిన్నాళ్లు ♦ జరపవలసె
నిఁక నే సహింపను నీ ♦ విపుడు నన్నేమైన
శిక్షచేసినఁ జేయు ♦ సిద్ధమయితి
తే. నేఁడు కరుణింపకుంటివా ♦ నిశ్చయముగఁ
దెగఁబడితిఁ జూడు నీతోడ ♦ జగడమునకు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 47
సీ. హరి నీకుఁ బర్యంక♦మైన శేషుఁడు చాలఁ

బవనము భక్షించి ♦ బ్రదుకుచుండు
ననువుగా నీకు వా♦హన మైనఖగరాజు
గొప్ప బాములను నోటఁ ♦ గొఱుకుచుండు
నదిగాక నీభార్య ♦ యైనలక్ష్మిదేవి
దినము పేరంటంబు ♦ దిరుగుచుండు
నిన్ను భక్తులు పిల్చి ♦ నిత్యపూజలుచేసి
ప్రేమఁ బక్వాన్నముల్ ♦ పెట్టుచుండ
తే. స్వస్థముగ నీకు గ్రాసము ♦ జరుగుచుండఁ
గాసు నీచేతి నొకటైన ♦ గాదు వ్యయము
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 48
సీ. పుండరీకాక్ష నా♦రెండుకన్నులనిండ
నిన్నుఁ జూచెడిభాగ్య ♦ మెన్నఁడయ్య
వాసిగా నామనో♦వాంఛ దీరెడునట్లు
సొగసుగా నీరూపుఁ ♦ జూపవయ్య
పాపకర్ముని కంటఁ ♦ బడక పోవుదమంచుఁ
బరుష మైనప్రతిజ్ఞ ♦ పట్టినావ
వసుధలోఁ బతితపా♦వనుఁడ వీవంచు నేఁ
బుణ్యవంతులనోటఁ♦బొగడవింటి
తే. నేమిటికి విస్తరించె నీ♦కింతకీర్తి
ద్రోహినైనను నాకీవు ♦ దొరకరాదె
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 49
సీ. పచ్చిచర్మపుఁదిత్తి ♦ పసలేదు దేహంబు

లోపల నంతట ♦ రోయరోఁత
నరములు శల్యముల్ ♦ నవరంధ్రములు రక్త
మాంసంపుకండలు ♦ మైలతిత్తి
బలువైన యెండవా♦నలకోర్వ దెందైనఁ
దాళలే దాఁకలి♦దాహములకు
సకలరోగములకు ♦ సంస్థానమయియుండు
నిలువ దస్థిరమైన♦నీటిబుగ్గ
తే. బొందిలోనుండి ప్రాణముల్ ♦ పోయినంత
గాటికేకాని కొఱగాదు ♦ గవ్వకైన
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 50
సీ. బలురోగములకు నీ♦పాదతీర్థమెకాని
వలపుమందులు నాకు ♦ వలదువలదు
చెలిమిసేయుచు నీకు ♦ సేవఁజేసెదఁగాని
నీదాసకోటిలో ♦ నిలుపవయ్య
గ్రహభయంబునకుఁ జ♦క్రము దలంచెదఁగాని
ఘోరరక్షలుగట్టఁ ♦ గోరనయ్య
పాముకాటున నిన్ను ♦ భజనఁజేసెదఁగాని
దాసిమంత్రము నేను ♦ దలఁపనయ్య
తే. దొరకితివి నాకు దండివై♦ద్యుఁడవు నీవు
వేయికష్టాలువచ్చిన ♦ వెఱవనయ్య
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 51
సీ. కూటికోసరము నేఁ ♦ గొఱగానిజనులచేఁ

బలుగద్దరింపులు ♦ పడఁగవలసె
దారసుతభ్రమ ♦ దగిలియుండఁగఁగదా
దేశదేశములెల్లఁ ♦ దిరుగవలసెఁ
బెనుదరిద్రతపైని ♦ బెనఁగియుండఁగఁగదా
చేరి నీచులసేవ ♦ చేయవలసె
నభిమానములు మది ♦ నంటియుండఁగఁగదా
పరులఁ జూచిన భీతి ♦ పడఁగవలసె
తే. నిటుల సంసారవారిధి ♦ నీఁదలేక
వేయివిధముల నిన్ను నే ♦ వేఁడుకొంటి
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 52
సీ. సాధుసజ్జనులతో ♦ జగడమాడినఁ గీడు
కవులతో వైరంబు ♦ గాంచఁ గీడు
పరమదీనులఁ జిక్కఁ♦బట్టికొట్టినఁ గీడు
భిక్షకులను దుఃఖ♦పెట్టఁ గీడు
నిరుపేదలనుజూచి ♦ నిందఁజేసినఁ గీడు
పుణ్యవంతులఁ దిట్టఁ ♦ బొసఁగుఁ గీడు
సద్భక్తులను దిర♦స్కారమాడినఁ గీడు
గురునిద్రవ్యము దోఁచు♦కొనినఁ గీడు
తే. దుష్టకార్యము లొనరించు♦దుర్జనులకు
ఘనతరంబైననరకంబు ♦ గట్టిముల్లె
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 53
సీ. పరులద్రవ్యముమీఁద ♦ భ్రాంతినొందినవాఁడు

పరకాంతలఁ గవేక ♦ పడెడువాఁడు
అర్థులవిత్తంబు ♦ లపహరించెడువాఁడు
దాన మియ్యంగ వ♦ద్దనెడువాఁడు
సభలలోపలనిల్చి ♦ చాడిచెప్పెడువాఁడు
పక్షపువాక్యంబు ♦ పలుకువాఁడు
విష్ణుదాసులఁజూచి ♦ వెక్కిరించెడువాఁడు
ధర్మసాధులఁ దిట్టఁ ♦ దలఁచువాఁడు
తే. పక్షిజల జంతుల హింసించు♦పాతకుండు
కాలకింకరగదలచేఁ ♦ గష్టమొందు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 54
సీ. నరసింహ నాతండ్రి ♦ నన్నేలు నన్నేలు
కామితార్థము లిచ్చి ♦ కావు కావు
దైత్యాంతకా చాల ♦ దయయుంచు దయయుంచు
దీనపోషక నీవె ♦ దిక్కు దిక్కు
రత్నభూషితవక్ష ♦ రక్షించు రక్షించు
భువనరక్షక నన్నుఁ ♦ బ్రోవు ప్రోవు
మారకోటిస్వరూప ♦ మన్నించు మన్నించు
పద్మలోచన చేయి ♦ పట్టు పట్టు
తే. సురవినుత నేను నీచాటుఁ ♦ జొచ్చినాను
నామొఱాలించి కడతేర్చు ♦ నాగశయన
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 55
సీ. నీభక్తులను గనుల్♦నిండఁజూచియు రెండు

చేతుల జోహారు ♦ సేయువాఁడు
నేర్పుతో నెవరైన ♦ నీకథల్ చెప్పంగ
వినయమందుచుఁ జాల ♦ వినెడువాఁడు
తనగృహంబునకు నీ ♦ దాసులు రాఁ జూచి
పీఁటపైఁ గూర్చుండఁ ♦ బెట్టువాఁడు
నీసేవకులజాతి ♦ నీతు లెన్నక చాల
దాసోహ మని చేరఁ ♦ దలఁచువాఁడు
తే. పరమభక్తుండు ధన్యుండు ♦ భానుతేజ
వానిఁ గనుఁగొన్న బుణ్యంబు ♦ వసుధలోన
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 56
సీ. పంజరంబునఁ గాకి♦పక్షి నుంచిన లెస్స
పలుకునే వింతైన♦చిలుకవలెను
గార్దభంబును దెచ్చి ♦ కళ్లెమింపుగ వేయఁ
దిరుగునే గుఱ్ఱంబు♦తీరుగాను
ఎనుపపోతును మావ♦టీఁడు శిక్షించిన
నడచునే మదవార♦ణంబువలెను
పెద్దపిట్టకు మేఁతఁ♦బెట్టి పెంచినఁ గ్రొవ్వి
సాగునే వేఁటాడు♦డేగవలెను
తే. కుజనులను దెచ్చి నీసేవ♦కొలుపఁ బెట్ట
వాంఛతోఁ జేతురే భ♦క్తవరులవలెను
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 57
సీ. నిగమాదిశాస్త్రముల్ ♦ నేర్చినద్విజుఁడైన

యజ్ఞకర్తకు సోమ♦యాజియైన
ధరణిలోపలఁ బ్రభా♦తస్నానపరుఁడైన
నిత్యసత్కర్మాది♦నిరతుఁడైన
నుపవాసనియమంబు ♦ లుంచుసజ్జనుఁడైన
గావివస్త్రము గట్టు♦ఘనుఁడునైనఁ
దండి షోడశమహా♦దానపరుండైన
సకలయాత్రలు సల్పు♦సరసుఁడైన
తే. గర్వమునఁ గష్టపడి నిన్నుఁ ♦ గానకున్న
మోక్షసామ్రాజ్య మొందఁడు ♦ మోహనాంగ
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 58
సీ. పక్షివాహన నేను ♦ బ్రదికినన్నిదినాలు
కొండెగాండ్రను గూడి ♦ కుమతినైతి
నన్నవస్త్రములిచ్చి ♦ యాదరించుచు నన్నుఁ
గన్నతండ్రివి నీవె ♦ కమలనాభ
మరణమయ్యెడినాఁడు ♦ మమతతో నీయొద్ది
బంట్లతోలుము ముందు♦బ్రహ్మజనక
యనజభటావళి ♦ యాడ్వకుండగ మున్నె
కరుణతో నాయొద్దఁ ♦ గావలుంచు
తే. కొనుచు నిప్పుడె నీకెఁ బిల్చుకొనియు నీకు
సేవకునిఁ జేసికొనవయ్య ♦ శేషశయన
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 59
సీ. నీకు దాసుఁడనంటి ♦ నిన్ను నమ్ముక యుంటిఁ

గాన నాపై నేఁడు ♦ కరుణజూపు
దోసిలొగ్గితి నీకు ♦ ద్రోహ మెన్నఁగఁబోకు
పద్మలోచన నేను ♦ బరుల వేఁడఁగాను
భక్తినీపై నుంచి ♦ భజనఁజేసెదఁగాని
పరుల వేఁడను జుమ్మి ♦ పరము లిమ్ము
దండిదాతవు నీవు ♦ తడవుసేయక కావు
ఘోర పాతకరాశి ♦ గొట్టివైచి
తే. శీఘ్రముగఁ గోర్కెలీడేర్చు ♦ చింతదీర్చు
నిరతముగ నన్నుఁ బోషించు ♦ నెనరునుంచు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 60
సీ. విద్యనేర్చితి నంచు ♦ విఱ్ఱవీఁగఁగ లేదు
భాగ్యవంతుఁడ నంచుఁ ♦ బలుకలేదు
ద్రవ్యవంతుఁడ నంచుఁ ♦ దఱచు నిక్కఁగ లేదు
నితరదానములైన ♦ నెఱుఁగలేదు
పుత్రవంతుఁడ నంచు ♦ బొంగుచుండఁగ లేదు
భృత్యవంతుఁడ నంచు ♦ వీఁగలేదు
శౌర్యవంతుఁడ నంచు ♦ సంతసింపఁగ లేదు
కార్యవంతుఁడ నంచుఁ ♦ గడవలేదు
తే. నలుగురికి మెప్పుగానైన ♦ నడవలేదు
నన్నునే ♦ నమ్మినాను
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 61
సీ. అతిలోభులను భిక్ష ♦ మడుగఁబోవుటరోఁత

తనదరిద్ర్య మొకరింట ♦ దాఁచరోఁత
గుణహీనుఁ డగువాని ♦ కొలువుగొల్చుటరోఁత
మొగలపంచలక్రింద ♦ నుండ రోఁత
భాగ్యవంతునితోడఁ ♦ బంతమాడుటరోఁత
గుఱిలేనిబంధులఁ ♦ గూడరోఁత
నాదాయములు లేక ♦ యప్పుదీయుటరోఁత
జారచోరులఁ గూడి ♦ చనుటరోఁత
తే. యాదిలక్ష్మీశ నీబంట ♦ నైతినయ్య
* యింక నెడఁబాయ జన్మంబుఁ ♦ బొందరోఁత
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 62
సీ. వెఱ్ఱివానికి నేల ♦ వేదాక్షరంబులు
మోటువానికి మంచి♦పాటలేల
పసులగాఁపరి కేల ♦ పరతత్త్వబోధలు
విటకానికేలపో ♦ విష్ణుకథలు
వదరుశుంఠల కేల ♦ వ్రాఁతపుస్తకములు
తిరుగుదిమ్మరి కేల ♦ దేవపూజ
ద్రవ్యలోభికి నేల ♦ దాతృత్వగుణములు
దొంగబంటుకు మంచి♦సంగతేల
తే. క్రూరజనులకు సిరిమీఁదఁ ♦ గోరికేల
ద్రోహి పాపాత్ములకు దయా♦దుఃఖమేల
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 63

* బొంది విడబాస

సీ. నాతండ్రి నాదాత ♦ నాయిష్టదైవమా
నన్ను మన్ననసేయు ♦ నారసింహ
దయయుంచు నామీఁద ♦ దప్పులన్ని క్షమించు
నిగమగోచర నాకు ♦ నీవెదిక్కు
నేనురాత్ముఁడనంచు ♦ నెమ్మనంబునఁ గోప
గింపఁబోకుము స్వామి ♦ యింతకైన
ముక్తిదాయక నీకు ♦ మ్రొక్కినందుకు నన్ను
గరుణించి రక్షించు ♦ కమలనాభ
తే. దండిదొర వంచు నీవెంటఁ ♦ దగిలినాను
నేఁడు పరిత్యక్తమై నన్ను ♦ నిర్వహింపు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 64
సీ. వేమాఱు నీకథల్ ♦ వినుచు నుండెడివాఁడు
పరులముచ్చటమీఁద ♦ భ్రాంతిపడఁడు
అగణితంబుగ నిన్నుఁ ♦ బొగడ నేర్చినవాఁడు
చెడ్డమాటలు నోటఁ ♦ జెప్పఁబోఁడు
ఆసక్తిచేత నీ ♦ న్ననుసరించెడివాఁడు
ధనమదాంధుల వెంటఁ ♦ దగులఁబోఁడు
సంతసంబున నిన్ను ♦ స్మరణఁ జేసెడివాఁడు
చెలఁగి నీచుల పేరఁ ♦ దలఁపఁబోఁడు
తే. నిన్ను నమ్మినభక్తుండు ♦ నిశ్చయముగఁ
గోరి చిల్లరదైవముల్ ♦ గొల్వఁబోఁడు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 65

సీ. నే నెంతవేఁడిన ♦ నీ కేల దయరాదు
పలుమాఱు పిలిచినఁ ♦ బలుక వేమి
* పలికిన నీకున్న ♦ పద వేమి పోవు నీ
మోమైనఁ బొడచూప ♦ వేమి నాకు
శరణుఁ జొచ్చినవాని ♦ సవరించవలెఁగాక
పరిహాసించుట నీకు ♦ బిరుదుగాదు
నీదాసులకు నీవు ♦ నిర్వహింపకయున్నఁ
బరు లెవ్వ రగుదురు ♦ పంకజాక్ష
తే. దాత దైవంబు తల్లియుఁ ♦ దండ్రి నీవె
నమ్మియున్నాను నీపాద♦నలినములను
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 66
సీ. వేదముల్ చదివెడు♦విప్రవర్యుం డైన
రణము సాధించెడు♦రాజు లైన
వర్తకకృషికుఁడౌ ♦ వైశ్యముఖ్యుం డైనఁ
బరిచరించెడి శూద్ర♦వర్యుఁ డైన
మెచ్చుఖడ్గముఁ బట్టి ♦ మెఱయుమ్లేచ్ఛుం డైనఁ
బ్రజల కక్కఱపడు♦రజకుఁ డైన
చర్మ మమ్మెడిహీన♦చండాలనరుఁ డైన
నీమహీతలమందు ♦ నెవ్వఁ డైన
తే. నిన్నుఁ గొనియాడుచుండెనా♦నిశ్చయముగ
వాఁడు మోక్షాధికారి యీ♦వసుధలోన
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస

* పదవికిలోపమా

దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 67

సీ. సకలవిద్యలు నేర్చి ♦ సభ జయింపఁగవచ్చుఁ
శూరుఁడై రణమందుఁ ♦ బోరవచ్చు
రాజరాజై పుట్టి ♦ రాజ్య మేలఁగవచ్చు
హేమగోదానంబు ♦ లియ్యవచ్చు
గగనమం దున్న చు♦క్కల నెంచికొనవచ్చు
జీవరాసుల పేళ్ళు ♦ చెప్పవచ్చు
అష్టాంగయోగంబు ♦ లభ్యసింపఁగవచ్చు
మేఁకరీతిగ నాకు ♦ మెసవవచ్చు

తే. దామరసగర్భహరపురం♦దరులకైన
నిన్ను వర్ణింపఁ దర మౌనె ♦ నీరజాక్ష
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర.

సీ. నరసింహ నీవంటి♦దొరను సంపాదించి
కుమతిమానవుల నేఁ ♦ గొల్వఁజాల
నెక్కువైశ్వర్యంబు ♦ లియ్యలే కున్నను
బొట్టకుమాత్రము ♦ పోయరాదె
ఘనముగా దిది నీకు ♦ కవివునఁ బోషింపఁ
గష్ట మెంతటిస్వల్ప♦కార్యమయ్యా
పెట్టఁ జాలక యేల ♦ బిక్ష మెత్తించెదు
నన్ను బీదను జేసి♦నా వదేమి

తే. అసుల కమలాక్ష నేనిట్లు ♦ శ్రమపడంగ
కన్నులకుఁ బండువై నీకుఁ ♦ గానఁబడునె
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస

దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 69

సీ. వనజాతనాభ నీ ♦ వంకఁ జేరితి నేను
గట్టిగా ననుఁ గావు ♦ కావు మనుచు
వచ్చినందుకు వేగ ♦ వరము లియ్యకఁ గాని
లేవఁబోయిన నిన్ను ♦ లేవనియ్యఁ
గూర్చుండఁబెట్టి నీ ♦ కొంగుఁ గట్టిగఁ బట్టి
పుచ్చుకొందును జూడు ♦ భోగిశయన
ఈవేళ నీకడ్డ ♦ మెవరు వచ్చినఁగాని
నారికై నను లోఁగి ♦ వడఁకఁబోను

తే. గోపగాఁడవు నీవు నా ♦ గుణము దెలిసి
యిప్పుడే నన్ను రక్షించి ♦ యేలుకొమ్మ
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 70

సీ. ప్రహ్లాదుఁ డేపాటి ♦ పైఁడికానుక లిచ్చె
మదగజం బెన్నిచ్చె ♦ మౌక్తికములు
నారదుం డెన్నిచ్చె ♦ నగలు రత్నంబు ల
హల్య నీ కేయగ్ర ♦ హార మిచ్చె
ఉడుత నీ కేపాటి ♦ యూడిగంబులు చేసె
ఘనవిభీషణుఁ డేమి ♦ కట్న మిచ్చె
పంచపాండవు లేమి ♦ లంచ మిచ్చిరి నీకు
ద్రౌపది నీ కెంత ♦ ద్రవ్య మిచ్చె

తే. నీకు వీ రంద ఱయినట్లు ♦ నేను గాన
నెందుకని నన్ను రక్షింప ♦ విందువదన
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస

దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 73

సీ. వ్యాసుఁ డేకులమందు ♦ వాసిగా జన్మించె
విదురుఁ డేకులమందు ♦ వృద్ధిఁ బొందెఁ
గర్ణుఁ డేకులమందు ♦ ఘనముగా వర్ధిల్లె
నావసిష్ఠుం డెట ♦ నవతరించె
నింపుగా వాల్మీకి ♦ యేకులంబున హెచ్చె
గుహుఁడను పుణ్యుఁ డే♦కులమువాఁడు
శ్రీశుకుం డెచ్చటఁ ♦ జెలఁగి జన్మించెను
శబరి యేకులమందు ♦ జన్మ మొందె

తే. నేకులంబున నీ రెంద ♦ ఱెచ్చినారు
నీకృపాపాత్రులకు జాతి♦నీతు లేల
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 74

సీ. వసుధాస్థలంబున ♦ వర్ణహీనుఁడుగాని
బహుళదురాచార♦పరుఁడుగాని
తడసి కా సివ్వని♦ధర్మశూన్యుఁడుగాని
చదువ నేరనిమూఢ♦జనుఁడుగాని
సకలమానవులు మె♦చ్చనికృతఘ్నుఁడుగాని
చూడ సొంపును లేని♦కుంఠగాని
అప్రతిష్టలకు లో♦నైన దీనుఁడుగాని
మొదటి కే మెఱుఁగని♦మోటుగాని

తే. ప్రతిదినము నీదుభజన చేఁ ♦ బరఁగునట్టి
వాని కేవంక లేదయ్య ♦ వచ్చు ముక్తి
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస

దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 75

సీ. ఇభకుంభములమీఁద ♦ నెగిరెడిసింగంబు
ముట్టునే కుఱుచైన ♦ మూషకమును
నవచూతపత్రముల్ ♦ నములుచున్న పికంబు
గొఱుకునే జిల్లేడు ♦ కొనలు నోట
అరవిందమకరంద ♦ మనుభవించెడి తేఁటి
పోవునే పల్లేరు ♦ పూలకడకు
లలిత మైనరసాల ♦ ఫలముఁ గోరెడిచిలు-
మెసవునే భ్రమత ను ♦ మ్మెత్తకాయ
తే. నిలను నీకీర్తనలు పాడ ♦ నేర్చినతఁడు
పరులకీర్తనఁ బాడునే ♦ యరసి చూడ
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 76

సీ. సర్వేశ నీపాద ♦ సరసిజద్వయమందుఁ
జిత్త ముంచఁగ లేను ♦ జెదరకుండ
నీవైన దయ యుంచి ♦ నిలిచి యుండెడునట్లు
చేసి నన్నేలు ♦ నే సేవకుఁడను
వనజలోచన నేను ♦ వట్టిమూర్ఖుఁడ సుమ్మీ
నీస్వరూపము జూడ ♦ నేర్పు వేగ
తనకుమారున కుగ్గు ♦ దల్లి పోసినయట్లు
భక్తిమార్గంబను ♦ పాలుపోసి
తే. ప్రేమతో నన్నుఁ బోషించు ♦ పెంచుకొనుము
ఘనత కెక్కించు నీదాస ♦ గణములోన
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస

దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 77

సీ. జీమూతవర్ణ నీ♦మోముతో సరిరాక
కమలారి యతికళం♦కమునఁ బడియె
సొగసైన నీనేత్ర♦యుగముతో సరిరాక
నళినబృందము నీళ్ల♦నడుమఁ జేరెఁ
గరిరాజవరద నీ♦గళముతో సరిరాక
పెద్దశంఖము బొబ్బ♦పెట్టఁ దొడఁగె
శ్రీపతి నీదివ్య♦రూపుతో సరిరాక
పుష్పబాణుఁడు నీకుఁ ♦ బుత్రుఁ డయ్యె
తే. ఇందిరాదేవి నిన్ను మో♦హించి విడక
నీకుఁ బట్టపుమహిషి యయ్యె ♦ నిశ్చయముగ
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 78

సీ. హరిదాసులను నింద ♦ లాడకుండినఁ జాలుఁ
సకలగ్రంథమ్ములు ♦ చదివినట్లు
భిక్ష మియ్యంగఁ ద♦ప్పింపకుండినఁ జాలుఁ
జేముట్టి దానంబు ♦ చేసినట్లు
మించి సజ్జనుల వం♦చించకుండినఁ జాలు
నింపుగా బహుమాన ♦ మిచ్చినట్లు
దేవాగ్రహారముల్ ♦ దీయకుండినఁ జాలుఁ
గనకకంబపుగుళ్ళు ♦ గట్టినట్లు
తే. ఒకరివర్ధాశనము ముంచ♦కున్నఁ జాలుఁ
బేరుకీర్తిగ సత్రము ♦ పెట్టినట్లు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస

దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 81

సీ. పద్మాక్షి మమతచేఁ ♦ బరము నందెద మంచు
విత్తమీఁగెద మయ్య ♦ వెట్టిపట్టి
మాస్వతంత్రంబైన♦మదము గండ్లకుఁ గప్పి
మొగముపట్టదు కామ♦మోహమునను
బ్రహ్మదేవుండైనఁ ♦ బైఁడిదేహము గల్గఁ
జేసివేయక మమ్ముఁ ♦ జెఱిచె నతఁడు
తుచ్ఛమైనటువంటి♦తోలెమ్ముకలతోడి
ముఱికితిత్తులు చేర్చి ♦ మూటకట్టె
తే. నీశరీరాలు పడిపోవు ♦ టిఱుఁగ కేము
కాముకుల మైతి మీఁక మిమ్ముఁ ♦ గానలేము
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 82

సీ. గరుడవాహన దివ్య♦కౌస్తుభాలంకార
రవికోటితేజ సా♦రంగవదన
మణిగణాన్విత హేమ♦మకుటాభరణచారు
మకరకుండల లస♦న్మందహాస
కాంచనాంబర రత్న♦కాంచీవిభూషిత
సురవరార్చిత చంద్ర♦సూర్యనయన
కమలనాభ ముకుంద ♦ గంగాధరస్తుత
రాక్షసాంతక నాగ♦రాజశయన
తే. పతితపావన లక్ష్మీశ ♦ బ్రహ్మజనక
భక్తవత్సల సర్వేశ ♦ పరమపురుష
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస

దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 83

సీ. పలుమాఱు దశరూప♦ములు ధరించితి వేల
యేకరూపముఁ బొంద ♦ వేల నీవు
నయమున క్షీరాబ్ధి♦నడుమఁ జేరితి వేల
రత్నకాంచనమంది♦రములు లేవె
పన్నగేంద్రుని మీఁదఁ ♦ బవ్వళించితి వేల
జలతారుపట్టుమం♦చములు లేవె
ఱెక్కలు గలపక్షి ♦ నెక్కసాగితి వేల
గజతురంగాందోళి♦కములు లేవె

తే. వనజలోచన యిటువంటి♦వైభవములు
సొగసుగా నీకుఁ దోఁచెనో ♦ సుందరాంగ
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 84

సీ. తిరుపతిస్థలమందుఁ ♦ దిన్నగా నే నున్న
వేంకటేశుఁడు మేఁత ♦ వేయలేఁడొ
పురుషోత్తమునకు నేఁ ♦ బోయినఁ జాలు జ
గన్నాథుఁ డన్నంబుఁ ♦ గడపలేఁడొ
శ్రీరంగమునకు నేఁ ♦ జేరఁబోయినఁ జాలు
స్వామి గ్రాసము బెట్టి ♦ సాకలేఁడొ
కాంచీపురములోనఁ ♦ గదిసి నే గొలువున్న
గరివరదుఁడు పొట్టఁ ♦ గడపలేఁడొ

తే. ఎందుఁ బోవక నేను నీ♦మందిరమున
నిలిచితిని నీకు నామీఁద ♦ నెనరు లేదు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస

దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 85

సీ. తార్క్ష్యవాహన నీవు ♦ దండిదాత వటంచు
గోరి వేడుక నిన్నుఁ ♦ గొల్వవచ్చి
యర్థిమార్గమున నే ♦ ననుసరించితినయ్య
లావైన బహునాళ్లు♦లక్షలైన
వేషముల్ వేసి నా♦విద్యాప్రగల్భతఁ
జూపసాగితి నీకు ♦ సుందరాంగ
ఆనందమైన నే ♦ ననుగవచ్చిన దిచ్చి
వాంఛఁ దీర్పుము సెల♦విప్పు వేగ
తే. నీకు నావిద్య హర్షంబు ♦ గాకయున్న
తేపతేపకు వేషముల్ ♦ దేను సుమ్మి
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 86

సీ. అమరేంద్రవినుత నే ♦ నతిదురాత్ముఁడ నంచుఁ
గాంబోలుకలనైనఁ ♦ గనులఁ బడవు
నీవుప్రత్యక్షమై ♦ నిలువకుండిన మానె
దొడ్డగా నొకయుక్తి ♦ దొరికెనయ్య
గట్టికొయ్యను దెచ్చి ♦ ఘనముగా ఖండించి
నీస్వరూపము చేసి ♦ నిలుపుకొంచు
ధూపదీపము లిచ్చి ♦ తులసితోఁ బూజించి
నిత్యనైవేద్యముల్ ♦ నేమముగను
తే. నడుపుచును నిన్నుఁ గొలిచెద ♦ నమ్మి బుద్ధి
నీప్రపంచంబు గలిగె నా ♦ కింతె చాలు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస

దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 87

సీ. భువనేశ గోవింద ♦ రవికోటిసంకాశ
పక్షివాహన భక్త ♦ పారిజాత
యంభోజభవరుద్ర ♦ జంభారిసన్నుత
సామగానవిలోల ♦ సారసాక్ష
వనధిగంభీర శ్రీ ♦ వత్స కౌస్తుభవక్ష
శంఖచక్రగదాది ♦ శార్ఙ్గహస్త
దీనరక్షక వాసు ♦ దేవ దైత్యవినాశ
నారదార్చిత దివ్య ♦ నాగశయన

తే. చారునవరత్నకుండల ♦ శ్రవణయుగళ
విబుధవందితపాదాబ్జ ♦ విశ్వరూప
భూషణవికాస శ్రీధర్మ ♦ పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 88

సీ. నాగేంద్రశయన నీ ♦ నామమాధుర్యంబు
మూఢుకన్నులసాంబ ♦ మూర్తి కెఱుక
పంకజాతాక్ష నీ ♦ బలపరాక్రమ మెల్ల
భారతీపతి యైన ♦ బ్రహ్మ కెఱుక
మధుకైటభారి నీ ♦ మాయాసమర్థత
వసుధలో బలిచక్ర ♦ వర్తి కెఱుక
పరమాత్మ నీ దగు ♦ పక్షపాతిత్వంబు
దశశతాక్షులపురం ♦ దరుని కెఱుక

తే. వీరి కెఱుక కగునీకథల్ ♦ వింత లెల్ల
నరుల కెఱుకన్న నెవరైన ♦ నవ్విపోరె

భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ♦దురితదూర. 89

సీ. అంద ఱేమైన ని ♦ న్నడుగవచ్చెద రంచు
క్షీరసాగరమందుఁ ♦ జేరినావు
నీచుట్టు సేవకుల్ ♦ నిలుపకుండుటకునై
భయదసర్పముమీఁదఁ ♦ బండినావు
భక్తబృందము వెంటఁ ♦ బడి చరించెద రంచు
నెగసి పొయ్యెడిపక్షి ♦ నెక్కినావు
దాసులు నీద్వార ♦ మాసింప కుంటకు
మంచియోధుల కావ ♦ లుంచినావు
తే. లావు గలవాఁడ వైతి వే♦లాగు నేను
నిన్నుఁ జూతును నాతండ్రి ♦ నీరజాక్ష
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 90

సీ. నీకథల్ చెవులలో ♦ సోఁకుట మొదలుగాఁ
బులకాంకురము మేనఁ ♦ బుట్టువాఁడు
నయమైననీదివ్య♦నామకీర్తనలోన
మగ్నుఁడై దేహంబు ♦ మఱచువాఁడు
ఫాలంబుతో నీదు♦పాదయుగ్మమునకుఁ
బ్రేమతో దండ మ♦ర్పించువాఁడు
హా పుండరీకాక్ష ♦ హా రామ హరి యంచు
వేడ్కతోఁ గేకలు ♦ వేయువాఁడు
తే. చిత్తకమలంబునను నిన్నుఁ ♦ జేర్చువాఁడు
నీదులోకమునం దుండు ♦ నీరజాక్ష

భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 90
సీ. నిగమగోచర నేను ♦ నీకు మెప్పగునట్లు
చెన్నుగాఁ బూజింప♦లేను సుమ్మి
నాకుఁ దోఁచినభూష♦ణములు పెట్టెద నన్నఁ
గౌస్తుభమణి నీకుఁ ♦ గలదు ముందె
భక్ష్యభోజ్యముల న♦ర్పణముఁ జేసెద నన్న
నీవు పెట్టితి సుధ ♦ నిర్జరులకు
గలిమికొద్దిగఁ గాను♦కల నొసంగెద నన్న
భార్గవీదేవి నీ♦భార్య యయ్యె
తే. నన్నిగలవాఁడ వఖిలలో♦కాధిపతివి
నీకు సొమ్ములు పెట్ట నే♦నెంతవాఁడ
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 92
సీ. నవసరోజదళాక్ష ♦ నన్నుఁబోషించెడు
దాతవు నీ వంచు ♦ ధైర్యపడితి
నామనంబున నిన్ను ♦ నమ్మినందుకుఁ దండ్రి
మేలు నా కొనరింపు ♦ నీలదేహ
భళిభళి నీయంత♦ప్రభువు నెక్కడఁ జూడఁ
బుడమిలో నీపేరు ♦ పొగడ వచ్చు
ముందుఁ జేసిన పాప♦మును నశింపఁగఁ జేసి
నిర్వహింపుము నన్ను ♦ నేర్పుతోడఁ
తే. బరమసంతోష మాయె నా ప్రాణములకు
నీఋణము దీర్చుకొన నేర ♦ నీరజాక్ష

భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 93

సీ. ఫణులపుట్టలమీఁదఁ బవ్వళించినయట్లు
పులులచోటులఁ జేరఁబోయినట్లు
మకరివర్గం బున్నమడుఁగుఁ జొచ్చినయట్లు
గంగదాపున నిండ్లు గట్టినట్లు
చెదలుభూమిని చాఁప చేరఁ బఱచినట్లు
ఓటిబిందెలఁ బాల నునిచినట్లు
వెట్టివానికి బాలవిత్త మిచ్చినయట్లు
కమ్మగుడిసె మందుఁ గాల్చినట్లు
తే. స్వామి నీభక్తవరులు దుర్జనులతోడఁ
జెలిమిఁ జేసిన నాఁ తేని చేటువచ్చు
భూషణవికాస శ్రీధర్మపురనివాస
దుష్టసంహార నరసింహ దురితదూర. 94

సీ. దనుజసంహార చక్రధర నీకు దండంబు
లిందిరాధిప నీకు వందనంబు
పతితపావన నీకు బహునమస్కారముల్
నీరజాతదళాక్ష నీకు శరణు
వాసవార్చిత మేఘవర్ణ నీకు శుభంబు
మందరధర నీకు మంగళంబు
కంబుకంధర శార్ఙ్గకర నీకు భద్రంబు
దీనరక్షక నీకు దిగ్విజయము
తే. సకలవైభవములు నీకు సార్వభౌమ

నిత్యకల్యాణములు నగు ♦ నీకు నెపుడు
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 95

సీ. మత్స్యావతారమై ♦ మడుఁగులోపలఁ జొచ్చి
సోమకాసురుఁ ద్రుంచి ♦ చోద్య ముగను
దెచ్చి వేదములెల్ల ♦ దేవభూసురలకు
మెచ్చి యిచ్చితి వీవు ♦ మేలు నొంద
నావేదముల నియ్యు ♦ నాచారనిష్ఠల
ననుభవించుచు నుందు ♦ రవనిసురులు
సకలపాపంబులు ♦ సమసిపోవునటంచు
మనుజు లందఱు నీదు♦మహిమఁ దెలిసి
తే. యుందు రిటువంటివారు నీ♦యునికి దెలియు
వారలకు వేగ మోక్షంబు ♦ వచ్చు ననఘ
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 96

సీ. కూర్మావతారమై ♦ కుధరంబుక్రిందను
గోర్కెతో నుండవా ♦ కొమరుమిగిలి
వరహావతారమై ♦ వనభూములను జొచ్చి
శిక్షింపవా హిర♦ణ్యాక్షునపుడు
నరసింహమూర్తివై ♦ నరభోజను హిరణ్య
కశిపుని ద్రుంపవా ♦ కాంతిమీఱ
వామనరూపమై ♦ వసుధలో బలిచక్ర
వర్తి నణంపవా ♦ వైర ముడిగి
తే. యిట్టిపనులెల్లఁ జేయఁగా ♦ నెవ్వరికిని

దగును నరసింహ నీకె కాఁ ♦ దగును గాక
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 97

సీ. లక్ష్మీశ నీదివ్య♦లక్షణగుణములఁ
వినఁ జాల కెప్పుడు ♦ వెఱ్ఱినైతి
నా వెఱ్ఱిగుణములు ♦ నయముగా ఖండించి
నన్ను రక్షించు మో♦నళిననేత్ర
నిన్ను నే నమ్మితి ♦ నితరదైవముల నే
నమ్మలేదెప్పుడు ♦ నాగశయన
కాపాడినను నీవె♦కష్టపెట్టిన నీవె
నీపాదకమలముల్ ♦ నిరత మేను

తే. నమ్మియున్నాను నీపాద♦నళినభక్తి
వేగ దయచేసి రక్షించు ♦ వేదవేద్య
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 98

సీ. అమరేంద్రవినుత ని ♦ న్ననుసరించినవారు
ముక్తిఁ బొందిరి వేగ ♦ ముదముతోడ
నీపాదపద్మముల్ ♦ నెఱ నమ్మియున్నాను
నాకు మోక్షం బిమ్ము ♦ నళిననేత్ర
కాచి రక్షించు నన్ ♦ గడతేర్చు వేగమే
నీసేవకునిఁ జేయు ♦ నిశ్చయముగఁ
గాపాడినను నీకుఁ ♦ గైంకర్యపరుఁడనై
చెలఁగి నీపనులను ♦ జేయువాఁడ

తే. ననుచుఁ బలుమాఱు వేఁడెద ♦ నబ్జనాభ

నాకుఁ బ్రీత్యర్థ మగుచు ని♦న్నమ్మినాను
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 99

సీ. శేషప్ప యనుకవి♦ చెప్పినపద్యముల్
చెవులఁ గానంద మై♦ చెలఁగుచుండు
నేమనుజుం డైన ♦ నెలమి నీశతకంబు
భక్తితో విన్న స♦త్ఫలము గలుగుఁ
జెలఁగి యీపద్యముల్ ♦ చేర్చి వ్రాసినవారు
కమలాక్షుకరుణను ♦ గాంతు రెపుడు
నింపుగాఁ బుస్తకం ♦ బె[illegible] బూజించిన
దురితజాలంబులు ♦ దొలఁగి పోవు
తే. నిద్ది పుణ్యాకరం బని♦యెపుడు జనులు
గష్ట మెన్నక పఠియింపఁ ♦ గలుగు ముక్తి
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. 100

నృసింహశతకము

సంపూర్ణము.

Scape & Co., Printers, Cocanada:—1913.

సంస్కృతాంధ్ర గ్రంథములతో పురాణకావ్య నాటకాలంకారాది గ్రంథములన్నియును సుప్రసిద్ధములగు తెనుగు నాటకములన్నియును వలయు వారు ఈదిగువ అడ్రెసుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

---

| | | | |
|---|---|---|---|
| శశికల్యాణము—క్యాలికో బయిండు టీకాతాత్పర్యసహితము | 0 | 8 | 0 |
| డిటో రేఫర్ బయిండు | 0 | 6 | 0 |
| గజేంద్రమోక్షం క్యాలికో బైండు టీకాతాత్పర్యం | 0 | 8 | 0 |
| డిటో రేఫర్ బైండు | 0 | 6 | 0 |
| కలువాయిశతకము—టీకాతాత్పర్యసహితము. | 0 | 4 | 0 |
| కలివేలుశతకము— డిటో | 0 | 4 | 0 |
| [redacted] | | | |
| కుమారీశతకము— డిటో | 0 | 2 | 0 |
| భాస్కరశతకము— డిటో | 0 | 4 | 0 |
| మానసబోధశతకము. టీ॥ తా॥ | 0 | 8 | 0 |
| సుమతీశతకము—టీకాతాత్పర్యసహితము. చక్కగా పరిశోధితమై చిన్నసైజున గ్లేజు కాగితములమీఁద అచ్చువేయఁబడియున్నది. | 0 | 2 | 0 |
| దాశరథిశతకము—పై సుమతీశతకమువలెనే టీకాతాత్పర్యసహితము. | 0 | 4 | 0 |
| శ్రీవేంకటేశ్వరశతకము— డిటో | 0 | 2 | 0 |
| వృషాధిపశతకము—మూలముమాత్రము రు | 0 | 1 | 0 |

కరా్రి అచ్చయ్య,
బుక్కుసెల్లరు, రాజమండ్రి.

# ప్రకటన.

| | | | |
|---|---|---|---|
| గయోపాఖ్యానము | 0 | 8 | 0 |
| పారిజాతాపహరణము | 0 | 12 | 0 |
| ప్రసన్నయాదవము | 0 | 8 | 0 |
| పార్వతీపరిణయము | 0 | 6 | 0 |
| చంద్రమతీపరిణయము | 0 | 8 | 0 |
| సౌందర్యతిలక (రెండుభాగములు.) | 1 | 0 | 0 |
| హేమలత | 0 | 8 | 0 |
| అహల్యాబాయి | 0 | 8 | 0 |
| రామచంద్రవిజయము | 0 | 8 | 0 |
| వినోదములు (రెండుభాగములు) | 0 | 9 | 0 |
| గోదావరీమండలసభ | 0 | 8 | 0 |
| నందచరిత్ర | 0 | 1 | 0 |
| బెంజామిను ఫ్రాంక్లిన్ | 0 | 2 | 0 |
| మహాపురుషులజీవితములు మొదటిభాగము | 0 | 12 | 0 |
| డిటో రెండవభాగము | 0 | 10 | 0 |
| డిటో మూడవభాగము | 0 | 12 | 0 |
| రాజస్థానకథావళి మొదటిభాగము | 0 | 12 | 0 |
| డిటో రెండవభాగము | 0 | 12 | 0 |

పైగ్రంథములు వాలయువారు:—

కర్రా అచ్చయ్య,
బుక్కుసెల్లరు, రాజమండ్రి.